I cannot touch these sayings of Swami Vivekananda, without receiving a thrill through my body like an electric shock.

—*Romain Rolland.*

వివేకానందస్వామియొక్క ఈ గంభీర వాక్యములను పఠించినపుడు నా ఒడలంతయు ఎలక్ట్రిక్ షాక్ తగిలినట్లు కంపించుచున్నది. ఆ వాక్యములచే నేనెంతయో ప్రభావితుడనైతిని.

—రోమే రోలా.

# వివేకానంద సింహనాదము

## 1-వ భాగము

**Be Fearless!**






**Arise! Awake! Stop not till the goal is reached**

ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్నిబోధత!

ప్రకాశకులు:

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

శ్రీకాళహస్తి

**1981**

[వెల **1-50**

6 వ కూర్పు వఱకు 17,000
7 వ కూర్పు వఱకు 3,000
8 వ కూర్పు 1981 2,000



Never forget the glory of human nature! We are the greatest God that ever was or will be. Christs and Buddhas are but waves on the boundless ocean which I am.

—*Swami Vivekananda*

మానవునియొక్క మహిమాతిశయమును ఎన్నటికిని మఱువరాదు. ఇంతవరకు ఉండియున్నట్టిగాని, ఇకముందు ఉండబోవునట్టిగాని దేవులందఱికంటెను మనమే పెద్ద దేవులము. అపార సముద్రరూపమగు నాయందు (ఆత్మయందు) క్రీస్తువులు, బుద్ధదేవులు కేవలము తరంగములవంటివారే యగుదురు.

—స్వామి వివేకానంద

# ప్రస్తావన



శ్రీ వివేకానందస్వామి తన గంభీర ప్రబోధములచే ఆధ్యాత్మక్షేత్రమున జనులలో గొప్ప ఉత్తేజమును కలుగ జేసెను. అనుభూతియుక్తములగు వారి వాక్యములచే ప్రజల జీవితములో అపూర్వ నైతికపరిణామము సంభవించెను. వారి బోధలచే సామాన్యులెందరో ముముక్షువులైరి. ముముక్షువు లెందరో పరమశాంతిని బడసిరి. అట్టి మహనీయుని దివ్య వాక్కులలో అతిముఖ్యములైనవి కొన్ని ఈ గ్రంథమున పొందుపఱుపబడినవి. వారి ముఖతః నేరులో వెలువడిన ఇంగ్లీషు వాక్యములు ఎంత పటుతరములైనవో, గంభీరార్థ యుక్తములో పాఠకులకు అవగతమగుటకొఱకై ఆంగ్ల మూలము కూడ ఇందు చేర్చబడినది. వివేకానందుల ఈ మహోన్నత ఆధ్యాత్మిక సింహనాదము జనుల హృదయాంత రాళములో గొప్ప ఆధ్యాత్మిక పరిణామమును కలుగజేసి వారలను భగవత్సన్నిధికి తప్పక చేర్చగలదని విశ్వసించు చున్నాము.

ఓం

ఇట్లు

ప్రకాశకులు

Each of us is heir apparent to the emperor of emperors. We are the substance of God Himself.

(మనము అల్పులము కాము). మనలో ప్రతి వారును చక్రవర్తులకు చక్రవర్తి అయియున్న వాని యొక్క వారసులమే యగుదుము. మనము సాక్షాత్ భగవంతుని స్వరూపమే అయియున్నాము.

—స్వామి వివేకానంద

Arise, awake and stop not till the goal is reached. Arise, awake, awake from this hypnotism of weakness. None is really weak. The soul is infinite, omnipotent, omniscient. Stand up, assert yourself. Proclaim the God within you, do not deny Him!

లెమ్ము! మేలుకొనుము! గమ్యము చేరువఱకు నిలువకుము! లెమ్ము! ఈ దుర్బలత్వమను మైకమునుండి మేల్కాంచుము! మేల్కాంచుము! ప్రపంచములో ఎవరును దుర్బలులు కారు. ఆత్మ అనంతము, సర్వశక్తి యుతము, సర్వజ్ఞము అయి యున్నది. కాబట్టి లెమ్ము! నీ ఆత్మశక్తిని ప్రకటింపుము! నీలోనున్న దైవమును చాటుము! అతనిని ఎన్నడును తిరస్కరింపకుము!

Each soul is potentially divine. The goal is to manifest this divine within, by controlling nature, external and internal. Do this either by work or worship or psychic control, or philosophy, by one, or more or all of these-and be free. This is the whole of religion. Doctrines or dogmas or rituals, or temples, or forms and but secondary details.

ప్రతిజీవియు శక్తివంతమైన దివ్యమగు ఆత్మ స్వరూపము. బాహ్య, అభ్యంతర ప్రకృతులను వశపఱచుకొని అట్టి దివ్యత్వమును వ్యక్తపఱచుటయే జీవుని లక్ష్యము. ఇట్టి లక్ష్యమును కర్మచేగాని, లేక ఉపాసనచేగాని, లేక మనోనిగ్రహముచేగాని, లేక తత్త్వజ్ఞానముచేగాని, వీనిలో ఒకదానిచేగాని, కొన్నిటిచేగాని, లేక అన్నిటిచేగాని సాధించి విముక్తుడవుకమ్ము. సమస్తమతములయొక్క సారాంశమిదియే. ఇక తక్కిన సిద్ధాంతములు కర్మకలాపములు. పుస్తకములు, మందిరములు, రూపములు అన్నియు దీని తరువాత విషయములే యగును. కావున ప్రధానమైన ఆత్మ సంయమమును, ఇంద్రియనిగ్రహమును అలవఱచుకొని తనయందలి దివ్యత్వమును సర్వులు వ్యక్తపఱచుకొని ధన్యులగుదురుగాక!

In you is all power. Summon up your all powerfull nature, oh mighty one, and this whole universe will be at your feet. It is the Self alone that predominates, and not matter. It is those foolish people who identify themselves with their bodies that piteously cry 'weak, weak, we are weak'. We want great spirit, tremendous energy and boundless enthusiasm. No need of looking behind March forward !

మిత్రుడా! సమస్తశక్తియు నీయందే కలదు' వీరుడా! నీ యీ మహత్తర ఆత్మస్వభావమును ప్రత్యక్షము చేసికొనుము. అత్తటి యీ విశ్వమంతయును నీకు పాదాక్రాంతమగును. వాస్తవముగ ఆత్మయే సర్వత్ర కలదు కాని ప్రకృతి కాదు. దేహామే తామను కొను పామరులే 'మేము దుర్బలులము, దుర్బలులము!' అని విలపించుచుందురు. మహాధీరత్వము, అఖండశక్తి సామర్థ్యములు, అపరిమితోత్సాహము మనకిపుడు కావలసియున్నవి. వెనుక చూపు పనికిరాదు. ముందు నకే చనుడు!

In spite of the sparkle and glitter of western civilisation, in spite of all its marvellous manifestation of power, standing upon the platform, I tell them to their face that it is all vain. It is vanity of vanities. God alone lives; the soul alone lives; spirituality alone lives. Hold on to that.

పాశ్చాత్యనాగరికత తళుకుబెళుకులతో గూడి యున్నప్పటికిని, ఆశ్చర్యకరమైన భౌతికశక్తుల నయ్యది దిగ్దర్శనము చేసినప్పటికిని, అదియంతయు నిరుపయోగ మని ఈ ఉపన్యాసవేదికపై నిలబడి వారియెదుటనే చెప్పివైచుచున్నాను. అది శుష్కదండుగ. దైవమొక్క టియే సత్యము. ఆత్మయొక్కటియే సత్యము. పరమార్థ మొక్కటియే సత్యము. దానినే పట్టుకొనుడు!

Religion and religion alone is the life of India and when that goes India will die in spite of politics, in spite of social reforms, in spite of Kubera's wealth poured upon the head of everyone of her children.

మతమే, ముమ్మాటికి మతమే (దైవభావమే) భారతదేశముయొక్క జీవశక్తి. అది తొలగినచో ఎన్ని రాజకీయములున్నప్పటికిని, సాంఘిక సంస్కరణము లున్నప్పటికిని, కుబేరుని ధనము ప్రతివాని శిరమున గ్రుమ్మరింపబడినప్పటికిని, భారతదేశము జీవింపదు. (పతనమైపోవును.)

Let us all work hard my brethren, this is no time for sleep. On our work depends the coming of the India of the future. She is there readily waiting. She is only sleeping. Arise, and awake and see her seated, here, on her eternal throne, rejuvenated more glorious than she ever was—this mother-land of ours.

సోదరులారా! మనమందరమును గొప్పదీక్షతో పనిచేయుదము! నిద్రించుటకిది సమయము కాదు. భావి భారత దేశపు అభ్యుదయము మన కార్యదీక్షపై ఆధార పడియున్నది. భారతమాత కాచుకొని సిద్ధముగ నున్నది. లెండు! నిదుర మేలుకొనుడు. మన భారత మాతను చూడుడు! ఇదివఱ కెన్నడును లేని మహా వైభవముతో, ఉత్తేజముతో ఆమె తన శాశ్వతసింహాసనముపై నెట్లు కూర్చొనియున్నదో చూడుడు!

---

The Indian nation Cannot be Killed—Deathless it stands and it will stand so long as that spirit shall remain as the background and so long as her people do not give up their spirituality.

ఎంతవఱకు ఆత్మశక్తి, దైవభావము భారతదేశమునకు వెనుక ఆధారభూతముగా నిలబడియుండునో, ఎంతవఱకు భారతదేశపు ప్రజలు ఆధ్యాత్మికతను, దైవదృష్టిని విడనాడకయుందురో, అంతవఱకును భారతదేశము అచ్ఛేద్యమై అమరస్వరూపమై కలకాలము విలసిల్లగలదు!



Weakness is the one cause of suffering. We become miserable because we are weak. We lie, steal, kill and commit other crimes because we are weak. We die because we are weak. Where there is nothing to weaken us there is no death, nor sorrow.

బలహీనతయే సమస్త ఆపదలకును ఏకైక కారణము. బలహీనులము గనుకనే దుఃఖముల పాలగుచున్నాము. బలహీనులము గనుకనే అసత్యమాడుట, దొంగిలించుట, చంపుట, ఇతరాపరాధములు చేయుట సంభవించుచున్నది. బలహీనులము గనుకనే మరణించుచున్నాము. మనకు బలహీనతను కల్పించునదేదియు లేనిచో, ఇక మనకు చావు లేదు, దుఃఖము లేదు.

Let fate its hundred horrors send
And clotted darkness block the way,
All nature wear one angry frown
To crush you out still know, my soul
You are Divine March on and on
Nor right nor left but to the goal.

విధి విపరీతమై విషమపరీక్షాళ
తంటుల హింసింప దలచుగాక,
ప్రకృతి యంతయుఁ గనలి నిన్ గ్రాఁచుగాక
ఆత్ముడా! నీవు నీదు దివ్యత్వ మెఱిఁగి
త్రోవనాగక, ఇటు నటు తొలఁగక కలఁత
సైచి గమ్యాక దృష్టివై సాగుమయ్యా!

Be great. No great work can be done without sacrifice. The Purusha Himself sacrificed Himself to create this world. Lay down your comforts, your pleasures, your names, fame or position, nay even your lives and make a bridge of human chains over which millions will cross this ocean of life. Bring all forces of good together.

Do not care under what banner you march. Do not care what be your colour, green, blue, or red, but mix all the colours up, and produce that intense glow of white, the colour of love. Ours is to work. The results will take care of themselves.

గొప్పతనము గలిగియుండుము. త్యాగములేనిది ఏ గొప్ప కార్యమును సాధించుటకును శక్యముకాదు. ఈ జగత్తును సృజించుటకై ఆ పరమపురుషుడే త్యాగమొనర్చెను. మీ భోగములను, మీ సుఖములను, మీ పేరుప్రతిష్ఠలను, మీ పదవులను, తుదకు మీ ప్రాణములనైనను సమర్పించి మానవశరీరములను గొలుసుతో నొక వంతెనను నిర్మింపుడు. ఆ వంతెనమీదుగా కోటానుకోట్ల జనులీ సంసార సాగరమును దాటగలరు. ఉత్తమశక్తు లన్నిటిని ఒకటిగా కూర్పుడు.

ఏ పతాకముక్రింద మీరు నడకసాగించినను పరవాలేదు. మీ రంగు పచ్చనా, నీలమా, ఎఱుపా అని చూడవలదు. రంగులన్నిటిని కలిపి మహోజ్జ్వల శ్వేతవర్ణమును-'ప్రేమ'వర్ణమును తయారు చేయుడు. కార్యాచరణమే మనపంతు. ఫలితములు వానివవి అవి చూచుకొనగలవు. (ఫలప్రసక్తిలేక కార్యాచరణమునకు గడంగుడు.)

There is a danger of our religion getting into the kitchen. We are neither Vedantists, most of us, now, nor pauranics, nor Tantrics. We are just "Don't-touchists." Our religion is in the kitchen. Our God is the coocking-pot, and our religion is "Don't touch me, I am holy." If this goes for another century every one of us will be in a lunatic asylum.

మన మతము వంటయింటిలో నివాసమేర్పరచుకొను అపాయము కలదు! మనలో చాలామంది ఇప్పుడు వైదాంతికులముగాని, పౌరాణికులముగాని, తాంత్రికులముగాని కాము. మనము కేవలము 'తాకవద్దు' అనే సిద్ధాంతముదారము. మన మతము వంటింటిలోనున్నది. వంటపాత్రయే మన దేవుడు. 'నన్ను తాకవద్దు, నేను పవిత్రుడను' అనునదియే మన సిద్ధాంతము. ఈప్రకారముగ మఱియొక శతాబ్దమువఱకు కొనసాగినచో, మనలో ప్రతివాడును ఒక పిచ్చి ఆసుపత్రిలోనుండవలసి యుండును.

Nothing shall be done in haste. Purity, patience and perseverance are the three essentials to success and above all love. All time is yours, there is no indecent haste.

Every one of you must be a giant-must, that is my word. Obedience, readiness and love for the cause if you have these three, nothing can hold you back.

ఆవేశముచే, తొందరపాటుచే ఏ కార్యమున్ను సాధింపబడదు. పవిత్రత, సహనము, పట్టుదల అను ఈ మూడును కార్యసిద్ధికి, విజయమునకు అత్యావశ్యక ములు. అయితే ప్రేమ వానియన్నింటికంటెను ముఖ్యమైనది. అనంతకాలము మీదే; ఇక లేనిపోని తొందర యేల!

మీలో ప్రతివాడున్ను మహోన్నతిని పొందితీరవలెను. 'తీరవలెను' అని నొక్కి చెప్పుచున్నాను, జ్ఞాపకముంచుకొనుడు. విధేయత, సంసిద్ధత, కార్యదీక్ష అను ఈ మూడును మీరు కలిగియున్నచో, ఇక మీ యభివృద్ధికి ప్రపంచమున ఎవరున్ను అడ్డుపడజాలరు.

Truth, purity and unselfishness-wherever these are present, there is no power below or above the sun—to crush the possessor thereof. Equipped with these, one individual is able to face the whole universe in opposition.

సత్యము, పవిత్రత, నిస్స్వార్థత—అను ఈ సుగుణములు కలవానిని అణగద్రొక్కగల సామర్థ్యము ముల్లోకములందెవనికిని లేదు. జగత్తంతయు ఎదురు తిరిగి నిలిచినను ఈ సుగుణములు కలవాడు ఒంటరిగా వారినందఱిని ఎదిర్చి నిలువగలుగును.



But mark you, if you give up that spirituality leaving aside to go after the materialising civilisation of the west, the result will be that in three generations you will become an extinct race, because the backbone of the nation will be broken, the foundation upon which the national edifice has been built will be undermined and the result will be annihilation all round.

జ్ఞాపకముంచుకొనుడు! పాశ్చాత్య భౌతిక నాగరికతవైపు పరుగిడుచు ఆధ్యాత్మికత్వమును మీరు విసర్జించినచో ఇక మూడు తరముల లోపల మీ జాతియంతయు సర్వనాశనమై పోగలదు. ఏలయనగా, ఆధ్యాత్మికతను విస్మరించుటవలన దేశముయొక్క వెన్నెముకయే చితికిపోయినదగును; ఏ పునాదిపై జాతీయ సౌధము నిర్మింపబడినదో అది ధ్వంసమైపోయినట్లగును; తత్ఫలితముగ సర్వత్ర వినాశమే సంభవింపగలదు.

Look at the 'ocean' and not at the 'wave'; see no difference between ant and angel. Every worm is the brother of the Nazarence (Christ.) How say one is greater and one less? Each is great in his own place.

సముద్రముపై దృష్టినుంచుము, తరంగముపై కాదు. భేదబుద్ధిలేక చీమను, దేవతను ఒక్కటిగనే వీక్షింపుము. ప్రతి కీటకమున్ను ఏసుక్రీస్తుయొక్క సోదరుడే. ఒకడు తక్కువ, ఒకడు ఎక్కువ అని ఎట్లు చెప్పగలము? ప్రతివాడు తన తన స్థానమున (ఆత్మదృష్టియందు) గొప్పవాడే యగును.

The greatest error, says the Vedanta, is to say that you are weak, that you are a sinner, a miserable creature, and that you have no power and you cannot do this and that.

Strength is life, weakness is death. strength is felicity, life eternal, immortal' Weakness is constant strain and misery. Weakness is death. Let positive, strong, helpful thoughts enter into your brains from very child-hood.

'నీవు దుర్బలుడవు. నీవు పాపివి, నీవు నీచుడవు, నీవు శక్తిహీనుడవు, నీవు అసమర్థుడవు' అని పలుకుటయే దోషములన్నింటిలోను పెద్దదోషమని వేదాంతము ఘోషించుచున్నది. (కావున అట్టి దుర్బలత్వమును పారద్రోలుడు!)

బలమే జీవనము. బలహీనతయే చావు. బలమే సుఖము. బలమే శాశ్వత, మరణరహిత జీవనము. బలహీనతయే నిరంతరశ్రమ, దుఃఖము. బలహీనతయే మరణము. (కావున) అభివృద్ధికరములై, బలప్రదములై, లోకోపకారకములైనట్టి గొప్ప భావములనే బాల్యకాలమునుండియు మీ మనంబున ప్రవేశింపజేయుదురు గాక!

Say, brother—"The soil of India is my highest heaven, the good of India is my good," and repeat and pray day and night-"O Thou Lord of Gauri! O Thou Mother of the Universe! Vouchsafe manliness into me! O Thou Mother of strength take away my weakness, take away my unmanliness, and - Make me a Man."

సోదరా! 'భారతభూమియే నా అత్యున్నత స్వర్గము, భారత దేశపు శ్రేయమే నా శ్రేయము' అని పలుకుము. రేయింబవళ్లు ఈ వాక్యమునే సంస్మరించుచుండుము. ఈ ప్రార్థనమునే చేయుచుండుము—'ఓ గౌరీపతీ, పరమశివా! ఓ జగజ్జననీ పార్వతీ! నాకు మానవత్వమును, ధైర్యమును ప్రసాదింపుడు! సర్వశక్తికి మూలమవగు ఓ తల్లీ! దుర్బలత్వమును, పౌరుషవిహీనత్వమును నానుండి పారద్రోలుము! నన్ను మానవత్వమునకు యోగ్యునిగ ఒనర్పుము!

---

Close your lips and let your hearts open. Work out the salvation of this land and of the whole world, each of you thinking that the entire burden is on your shoulders. Carry the light and the life of Vedanta to every door and rouse up the divinity that is hidden within every soul. Then whatever may be the measure of your success, you will have the satisfaction that you have lived, worked and died for a great cause.

మాటలు తగ్గించి హృదయములను తెఱచి యుంచుడు. ఈ దేశముయొక్కయు, ప్రపంచమంతటి యొక్కయు విముక్తిమార్గము నాలోచింపుడు! ఈభార మంతయు మీమీదనే యున్నదని మీలో ప్రతివాడును తలంచును గాక! వేదాంతముయొక్క ప్రకాశమును, జీవమును ప్రతియింటికిని గొనిపోయి, జనులందు నిద్రాణమైయున్న దివ్యత్వమును మేలుకొలుపుడు! అత్తరి మీ విజయము స్వల్పమైనను, అధికమైనను మేమొక మహత్తర పుణ్యకార్యసాధనకై, జీవించి, శ్రమించి, మరణించితి మను సంతుష్టి మీకు కలుగ గలదు. కాబట్టి లెండు! దేశోద్ధరణతత్పరులు కండు!

Stand up, be bold, be strong. Take the whole responsibility on your own shoulders and know that you are the creator of your own destiny. All the strength and succour you want is within yourselves. Therefore make your own future.

లెమ్ము! ధైర్యవంతుడవై, బలవంతుడవై నిలువుము! బాధ్యతనంతను నీ మీదనే పెట్టుకొనుము. మఱియు నీ విధికి నీవే కారణభూతుడవని యెఱుఁగుము. నీకు కావలసిన బలమంతయు, సహాయమంతయు నీయందే కలదు. కాబట్టి నీ భవిష్యత్తును నీవే నిర్మించుకొనుము!

The mother's heart, the hero's will
The sweetness of the southern breeze,
The sacred charm and strength that dwell
On Aryan altars, flaming, free;
All these be yours, and many more,
No ancient soul could dream before—
Be thou to India's future son
The mistress, servant, friend in one.

తల్లియొక్క హృదయము, శూరునియొక్క అకుంఠిత దీక్ష, మలయమారుతము (దక్షిణదిశయందలి వాయువు) యొక్క మాధుర్యము, జాజ్వల్యమానములై నిరర్గళములైనట్టి ఆర్యులహోమాగ్ని వేదికలందు వెలయు పరమ పవిత్రమగు శోభ, దివ్యబలము – వీనినన్నిటిని, నీవు పడయుదువు గాక! ఇంతియే కాదు. పూర్వీకులూహింపనటువంటి ఎన్నియో సుగుణములను నీవు పొందుదువుగాక! మఱియు భావిభారత పౌరునకు నీవు బంధువై, మిత్రుడవై, సేవకుడవై వర్ధిల్లుదువుగాక!!

Either in this world or in the world of religion it is true that fear is the sure cause of degradation and sin. It is fear that brings misery, fear that brings death, fear that breeds evil. And what causes fear? Ignorance of our own nature. Each of us is heir-apparent to the Emperor of Emperors.

ఈ భౌతిక ప్రపంచమునగాని ఆధ్యాత్మిక ప్రపంచమునగాని భయమనునది పతనమునకును, పాతకమునకును తప్పక కారణభూతమై యున్నదనుట పరమ సత్యము. భయమే దుఃఖమును గలుగజేయుచున్నది. భయమే మృత్యువునకు హేతుభూత మగుచున్నది. భయమే కీడును జనింప జేయుచున్నది. ఇట్టి భయమునకు కారణమేమి! తన (ఆత్మ) స్వరూపమును తానెఱుంగకుండుటయే. మనలో ప్రతివారున్ను చక్రవర్తులందఱికిని చక్రవర్తియై విలసిల్లు ఆత్మసామ్రాజ్యాధిపతికి వారసులమై యున్నాము.

We have wept long enough; no more weeping, but stand on your feet and be men. It is a man-making religion that we want. It is man-making theories that we want. It is man-making education all round that we want !

మనము ఏడ్చి ఏడ్చి అయినది. ఇక ఏడుపుమాని మన కాళ్ళపై మనము నిలబడి పౌరుషము చూపుదము గాక! మానవత్వమును నిర్మించు మతమే మనకిపుడు కావలసినది. మానవత్వమును నిర్మించు సిద్ధాంతములే మనకు కావలసినవి. సర్వత్ర మానవత్వమును నిర్మించు విద్యయే మనకు కావలసినది!

Here is the test of truth—Any thing that makes you weak physically, intellectually and spiritually, reject as poison. There is no life in it, it cannot be true. Truth is strengthening. Truth is purity. Truth is knowledge. Truth must be strengthening, must be enlightening, must be invigorating.

సత్యమునకు గుఱుతు ఇదియే— మిమ్ములను శారీరకముగాను, మానసికముగాను, ఆధ్యాత్మికముగాను ఏది దుర్బల మొనర్చునో దానిని విషమువలె త్యజించి వేయుము. దానియందు జీవము లేదు. కావున అది సత్య మెన్నటికిని కాజాలదు. సత్య మెప్పుడును బలవర్ధకమైయే యుండును. సత్యము నిర్మలమై జ్ఞానమయమై యుండును. సత్య మెప్పుడును బలప్రదమై, జ్ఞానోద్దీపకమై, శక్త్యుత్సాహదాయకమై యుండవలెను.

Go all of you, whereve there is an outbreak of plague or famine or wherever the people are in distress, and mitigate their sufferings. As the most, you may die in the attempt; what of that? How many like you are taking birth and dying like worms every day? What difference does that make to the world at large? Die you must, but have a great ideal to die for, and it is better to die with a great ideal in life. Preach this ideal from door to door and you will yourselves be benefited as well as, at the same time be doing good to your country. On you lie the future hopes of our country!

ప్లేగు(మహామారి)గాని, కరువుగాని ఎచ్చెచట సంభవించునో ఎచ్చెచట జనులు దురవస్థలపాలగుచుందురో, అచ్చటచటకు మీ రందఱును వెళ్ళి వారి దుఃఖములను ఉపశమింపజేయుడు. ఆ ప్రయత్నమున మీరొకవేళ మృతినొందినను, దానివలన ఒరిగిన దేమియు లేదు. ప్రతిదినము ఎందఱో పుట్టుచున్నారు, చచ్చుచున్నారు కీటకములవలె; దానిచే ఈ విశాలప్రపంచమున అణుమాత్రమైన భేదము కలుగుచున్నదా? చావు ఎవరికైనను తప్పదు. కావున ఒక మహోన్నతాదర్శముకొఱ కేల చావరాదు? గొప్ప ఆదర్శము గలిగి జీవించుట, అట్టి ఆదర్శమునకై మరణించుట శ్రేయస్కరమై యున్నది. పరప్రాణికి ఉపకారము చేయుటయను ఈ మహత్తర ఆదర్శమును మీరు ఇంటింటికిని వెళ్ళి బోధింపుడు. దానిచే మీరు మేలొందుటయే కాక, దేశమునకున్ను గొప్పమేలు చేసినవా రగుదురు. మనదేశము యొక్క భావి శ్రేయస్సంతయు మీమీదనే ఆధారపడియున్నది.

All expansion is life, all contraction is death. All love is expansion, all selfishness is contraction. Love is therefore the only law of life. He who loves lives. He who is selfish is dying. Therefore love for love's sake. Because it is the only law of life.

విశాలత్వమే జీవము. సంకుచితత్వమే మరణము. ప్రేమయంతయు విశాలత్వమే యగును. స్వార్థపరత్వమంతయు సంకుచితత్వమే యగును. కావున ప్రేమ యొక్కటియే జీవమును పరిపాలించు ధర్మము. ప్రేమాన్వితుడు జీవించియుండును. స్వార్థపరుడు మరణించుచున్నాడు. కాబట్టి ప్రేమనిమిత్తమే ప్రేమింపుము. ఏలయనిన అది యొక్కటియే జీవితముయొక్క ధర్మము.

Get up, and set your shoulder to the wheel. How long is this for? As you have come into this world, leave some mark behind. Otherwise where is the difference between you and the trees and stones?—they too come into existence, decay and die.

Be Bold! My children should be brave above all. Not the least compromise on any account. Preach the highest truths broadcast. Do not fear!

లెండు! కార్యాచరణమునకు గడంగుడు. ఎన్నాళ్ళిటు పడియుండుట! ఈ లోకమున జన్మించినదానికి గుఱుతుగా ఏదియో యొక మహాకార్యమును చేసిపొండు! లేకున్న, మీకును, ఈవృక్షములకును, శిలలకును ఏమి భేదము కలదు? అవికూడ పుట్టి, పెరిగి, నశించుచున్నవి గదా!

కావున, ధైర్యవంతులై యుండుడు! నాకుఱ్ఱలకు అన్నిటికంటె అధికముగా ధైర్యముండవలెను. అది ఏ కారణమువలన గూడ తగ్గరాదు. నాయనలారా! మహోన్నతములగు సత్యములను జనులకు బాహాటముగ బోధింపుడు! భయపడకుడు!

Manifest the divinity within you, and everything will be harmoniously arranged around it.

My child, what I want is muscles of iron and nerves of steel, inside which dwells a mind of the same material as that of which the thunderbolt is made. Remember, truth is infinitely more weighty than untruth, so is goodness. If you possess these, they will make their way by sheer gravity.

ముందు నీలోని దైవత్వమును ప్రదర్శింపుడు. అపుడు సమస్తము, దానిని చుట్టి తమ తమ స్థానముల నాక్రమించుకొని పరస్పరానుకూలములై యుండును.

వత్సా! నాకు కావలసినది ఇనుపకండరములు, ఉక్కునరములు, వానిలోపల నివసించు 'పిడుగు' పదార్థముతో చేయబడిన మనస్సు.

నాయనా! సత్యము అసత్యముకంటె ఎన్నిరెట్లో గురుతరమైనదని జ్ఞాపకమునం దుంచుకొనుము. అట్లే సౌజన్యమున్ను, ఈ రెండిటిని (సత్య, సౌజన్యములను) నీవు కలిగియున్నచో వానికిగల అపారశక్తిచే నీకు విజయము తప్పక చేకూరును.



This life comes and goes - Wealth, fame, enjoyments are only a few days. It is better, far better to die on the field of duty preaching the truth, than to die like a worldly worm, Advance!

ఈ జీవితము వచ్చును, పోవును. సంపదలు, కీర్తి భోగములు మూణ్ణాళ్ళముచ్చటలు. పురుగువలెచచ్చుట కంటె సత్యమును బోధించుచు కార్యక్షేత్రమున మరణించుట చాల ఉత్తమము. కావున ముందుకు సాగుడు!

Leave aside your thoughts of poverty! In what respects are you poor? Do you feel regret because you have not a coach and pair or a retinue of servants at your beck and call? What of that? You little know how you can have nothing undone in life if you labour day and night for others with your hearts's blood.

'నేను దరిద్రుడను, దీనుడను, పేదవాడను' ఈ మున్నగు తలంపులనే విడనాడుడు. ఏ విషయములందు మీరు పేదవారు? రెండుగుఱ్ఱాల 'సార్టు' లేదనియా మీ రాదిగులు? లేక మీ ఆజ్ఞను శిరసావహించు సేవకులు లేరనియా? దానివలన మీకు కలుగు నష్టమేమి? మీ హృదయరక్తమును వ్యయపఱచి అహోరాత్రములు పాటుపడితిరేని జీవితలక్ష్యమును సంపూర్ణముగా నెరవేర్చిన వారగుదురు. ఈవిషయమును మీరింకను తెలిసికొనలేదు. (ఇప్పటికైనను తెలిసికొని పరహితమునకై పాటుపడి జీవితమును సార్థకము చేసికొనుడు!)

—+—

This is the gist of all worship—to be pure and to do good to others. He who sees Siva in the poor, in the weak, and in the diseased, really worships Siva and if he sees Siva only in the image, his worship is but preliminary. He who has served and helped one poor man seeing Siva in him, without thinking of his caste, or creed, or race, or anything, with him Siva is more pleased than with the man who sees Him only in temples.

పవిత్రుడుగా నుండుటయు, ఇతరులకు సాయము చేయుటయు సమస్త పూజలయొక్క సారాంశము. బీదలయందు, దుర్బలులయందు, వ్యాధిగ్రస్తులయందు శివుని జూడగల్గువాడే వాస్తవముగ శివుని పూజించినవాడగును. కేవలము విగ్రహమునందు మాత్రమే శివుని జూచువాని పూజ సామాన్యమైనదియే యగును. జాతి మత కులాదులను లెక్కచేయక ఒక్క బీదవానిని- ఆతనిలోగల శివుని దర్శించుచు సేవించినవాని యెడల మఱియు సహాయమొనర్చినవాని యెడల శివుడు - దేవాలయములందు మాత్ర మాతనిని దర్శించువాని యెడల కంటె అధికమగు ప్రీతిగల్గి యుండును.

Do you think even an ant will die for want of your help? Most arrant blasphemy! The world does not need you at all. Blessed are we that we are given the privilege of working for him. Cut out this world 'help' from your mind. You cannot help; it is blaspheming. You Worship. Stand in that reverent attitude to the whole universe and then will come perfect non-attachment.

నీ సహాయము లేనిచో ఒక చీమయైన చచ్చునని నీవు తలంచుచున్నావా! ఎంత ఘోరమగు అపచారము! ప్రపంచమునకు నీతో ఏ విధమగు అక్కఱయు లేదు. భగవత్కార్యము నొనర్చు భాగ్యము మనకు ప్రసాదింపబడుట వలన మనము ధన్యులమైతిమి. 'సహాయము' అను మాటను నీమనస్సునుండి తొలగింపుము. నీవు 'సహాయము' చేయజాలవు. అట్లు చేయగలుగుదు నను కొనుట అపచారము. నీవు చేయునది 'ఆరాధనము' 'సేవ'. సమస్త విశ్వముయెడల పరిపూర్ణ భక్తి భావము గల్గి వినమ్రుడవై యుండుము. తత్ఫలితముగ సమగ్రమగు నిస్సంగత్వము నీకు లభింపగలదు.



Do not stand on a high pedestal and take five cents in your hand and say 'Here, my poor man,' but be grateful that the poor man is there, so that by making a gift to him you are able to help yourself. It is not the receiver that is blessed, but it is the giver.

ఏమో నీవు చాల గొప్పవాడవని తలంచి చేతిలో నాలుగు కాసులు తీసికొని బీదవానివైపు గిరాటు వేయకుము. మర్యాదగ అతనికిమ్ము. ఆ బీదవాడు అచట నున్నందుకు కృతజ్ఞుడవై యుండుము. అతనికి ఇచ్చుట వలన ఉపకారము నీకే హెచ్చుగ కలిగినదని తెలిసికొనుము. పుచ్చుకొనువాడు కాదు ధన్యుడు, ఇచ్చువాడు—అని జ్ఞాపక ముంచుకొనుము.

—ooooo—

Be unattached; let things work; let brain-centres work; work incessantly, but let not a ripple conquer the mind. Work as if you were a stranger in this land, a soujourner; work incessantly, but do not bind yourselves; bondage is terrible.

నిస్సంగుడవై యుండుము; ప్రకృతిని పనిచేయనిమ్ము; మెదడులోని కేంద్రములను పనిచేయనిమ్ము, సదా కార్యనిరతుడవై యుండుము. కాని మనస్సు దేనిచేతను తొణకక ప్రశాంతమై, నిశ్చలమై యుండుగాక! ఇది నీ స్వస్థలము కానట్లును, నీ విచట కొలది కాలము మాత్రమే ఉండి వెళ్లుటకు వచ్చినట్లును భావించి ప్రవర్తింపుము. ఎడతెగక పనిచేయుచుండుము. కాని బద్ధుడవు కాకుము. బద్ధత్వము మహాఘోరమైనది.

"If there is one word that you find coming out like a bomb from the Upanishads, bursting like a bombshell upon the masses of ignorance, it is the word fearlessness and the only religion that ought to be taught is the religion of fearlessness. It is fear that brings misery fear that breeds evil and what causes fear? Ignorance of our own nature."

ఉపనిషత్తులనుండి బాంబువలె వినిర్గతమై అజ్ఞాని
జనసందోహామధ్యమున పడి వారి అజ్ఞానమున పేల్చి
వేయునట్టి పదమేదైనయుండినచో అది 'నిర్భయత్వమే'
అయియున్నది. 'నిర్భయత్వ' మతమే యిపుడు చాట
దగిన ఏకైకమతము – భయమే దుఃఖమును గలుగ
జేయును. భయమే చావును తెచ్చును. భయమే
దోషములను సృజించును. ఇట్టి భయము దేనివలన
కలుగుచున్నది? మన స్వరూపమును మనము మఱచి
నందువలన.

Look upon every man, woman and everyone as God. You cannot help anyone; You can only serve; serve the children of the Lord, serve the Lord Himself, if you have the privilege. If the Lord grants that you can help anyone of His children, blessed you are; do not think too much of yourselves. Blessed you are that that privilege was given to you when others had it not. Do it only as worship. The poor and the miserable are for your salvation, so that we may serve the Lord coming in the shape of that diseased, coming in the shape of the lunatic, the leper and the sinner.

ప్రతి పురుషుని. స్త్రీని, ప్రాణిని భగవత్స్వరూపముగ వీక్షింపుము. నీవు ఎవరికైనను సేవ చేయగలవేగాని సహాయము చేయలేవు. భగవంతుని బిడ్డలను సేవింపుము. భగవంతునే సేవించు భాగ్యము లభించినచో అతనినే సేవింపుము. తన బిడ్డలలో ఎవరికైనను సేవచేయగల శక్తి భగవానుడు నీకు ప్రసాదించినచో నీవు అదృష్టవంతుడవు. అంతియే కాని అది నీ ప్రభావమని తలంచి అహంకరింపకుము. ఇతరులకు లేని భాగ్యము నీ కొసంగబడుట నీ అదృష్టముగదా! ఆరాధనయను భావముతో నితరులకు సేవచేయుము. రోగగ్రస్తుని రూపమున, వెఱ్ఱివానిరూపమున, కుష్ఠువురూపమున, పాపాత్ముని రూపమున భగవంతుడే వర్తించుచున్నాడు. కావున అట్టి వారికి సేవచేయుట మనధర్మము. దీనులు, దరిద్రులు, నిర్భాగ్యులు లోకమున నుండునది మన మోక్షముకొఱకే యని యెఱుంగుము.

Ye! divinities on earth! sinners! It is a sin to call a man so. It is a standing libel on human nature. Come up! O lions and shake off the delusion that you are sheep. You are souls immortal, spirits free, blest and eternal. You are not matter, you are not bodies. Matter is your servant, not you the servant of matter.

అవనిపై మూర్తీభవించిన ఓ దైవస్వరూపులారా! మీరు పాపులా! రామరామ! అట్లనుటయే పాపము. మానవుని పవిత్రస్వభావమునకు అది కళంకమాపాదించినట్లు. లెండు! ఓ సింహములారా! మీరు గొఱ్ఱెలను అపోహను తొలగించివేయుడు! మీరు శాశ్వత సచ్చిదానందాత్మస్వరూపులు. మీరు దృశ్యపదార్థములు కారు. మీరు దేహములు కారు. ప్రకృతి (దృశ్యవస్తువు) మీయొక్క దాసి. మీరు ప్రకృతియొక్క దాసులు కారు!

"So long as the millions live in hunger and ignorance, I hold every man a traitor who, having been educated at their expense, pays not the least heed to them" ……. ….

"Him I call a Mahatman whose heart bleeds for the poor. Otherwise he is a Duratman."

'ఈ లక్షలకొలది జనులు విద్య లేక, తినుటకు తిండి లేక, దుఃఖభూయిష్ఠమగు జీవితమును గడపుచుండ, వారి మూలమున తాను విద్యావంతుడయ్యును వారిని గూర్చిన ప్రసక్తియే లేని ప్రతివానిని నేను విశ్వాసఘాతకుడని, ద్రోహియని యందును.'

'ఎవని హృదయము పేదలకొఱకు పరితపించునో అట్టివానినే నేను మహాత్ముడందును. అట్లు కానివాడు దురాత్ముడే యగును.

Before flooding India with socialistic and political ideas, first delugu the land with spiritual ideas. The first work that demands our attention is, that the most wonderful truths confined in our Upanishads, in our scriptures, in our Puranas-must be brought out from the books, brought out from the monasteries, brought out from the forests, brought out from the possession of selected bodies of people and scattered broadcast all over the land, so that these truths may run like fire all over the Country, from north to south and east to west, from the Himalayas to Cape Comorin, from Sindhu to the Brahmaputra.

హిందూదేశమును సాంఘిక, రాజకీయ భావములతో నింపుటకుపూర్వము ఆధ్యాత్మిక భావములతో పరిపూర్ణ మొనర్పుడు. మన ఉపనిషత్తులందును, స్మృతులందును, పురాణములందును, నిగూఢముగనుండు మహోన్నత సత్యములను ఆ గ్రంథములలో నుండియు, మఠములలో నుండియు, అరణ్యములలో నుండియు, ప్రత్యేకవర్గముల స్వాధీనములో నుండియు బయటకు గొనివచ్చి దేశమందంతటను - ఉత్తరాగ్రమునుండి దక్షిణాగ్రము వఱకును, హిమాలయమునుండి కన్యాకుమారి వఱకును, సింధునదినుండి బ్రహ్మపుత్ర వఱకును, కార్చిచ్చువలె వ్యాపించునట్లు ధారాళముగ వెదజల్లవలయును.

Be great. No great work can be done without sacrifice. Lay down your comforts, your pleasures, your names, fame or position, nay even your lives and make a bridge of human chains over which millions will cross this ocean of life.

గొప్పబుద్ధి కలిగి యుండుడు. త్యాగము లేనిది ఏ మహాకార్యమున్ను సాధింపబడదు. మీ భోగములను, మీ సుఖములను, మీ పేరుప్రతిష్ఠలను, మీ పదవులను, వెయ్యేల మీ ప్రాణములను సైతము సమర్పించి కోటానుకోట్ల జనులు తరించుటకుగాను మానవదేహములను గొలుసులతో నొక వారధిని నిర్మింపుడు!



We do not mere tolerate, we unite ourselves with every religion, praying in the mosque of the Mohammedan, worshiping before the fire of the Zorastrian, and kneeling to the cross of the Christian. So we gather all these flowers and binding them together with the cord of love, make them into a wonderful bonquet of worship.

మేము కేవలము పరమతములను సహించుటయే కాక ప్రతిమతముతోను ఐక్యమొందుదుము. మహమ్మదీయుల మసీదునందు ప్రార్థనలను గావింతుము. జొరాస్ట్రియన్ల (పార్శీమతస్థుల) అగ్నిహోత్రమునందు ఆరాధన చేయుదుము. క్రైస్తవుల శిలువకు మోకరిల్లుదుము, కాబట్టి మతములను ఈ పుష్పములన్నిటిని సేకరించి ప్రేమ, సమానము అను దారముతో వానిని ఐక్యమొనర్చి అద్భుతమైన భక్తి కుసుమమాలగ గావింతుము.

---

Strike the iron when it is hot Idleness won't do. Throw overboard all idea of jealousy and egotism once for all. Come on to the practical field with tremendous energy to work in the fulness of strength. As to the rest the Lord will point out the way.

ఇనుము వేడిగా నున్నపుడే దానిని వంచి వేయుడు (అనుకూలతరుణము మించిపోవకమునుపే కార్యాచరణ శీలురు కండు!) సోమరితనము పనికిరాదు. ఈర్ష్యాహంకార భావములను దూరముగ పారద్రోలుడు. అఖండశక్తితో, పరిపూర్ణ బలముతో కార్యరంగమున ప్రవేశించి కృషి సల్పుడు! ఆపైన భగవంతుడే మీకు దారిచూపును.

Be heroes. Stand firm like a rock. Truth always triumphs. What India wants is a new electric fire to stir up a fresh vigour in the national veins. Be brave. Be brave; man dies but once. My disciples must not be cowards. I hate cowardice. Keep up the deepest mental poise. Take not even the slightest notice of what puerile creatures may be saying against you. Indifference! Indifference! Indifference! Bear in mind the eyes are two in number, and so the ears, but the mouth is but one. All great undertakings are achieved through mighty obstacles. Put forth your manly effort.

మీరందఱును వీరులు కండు। పర్వత స్థైర్యముతో నిలబడుఁడు। సత్యమే యెల్లప్పుడు జయించును. జాతీయ రక్తనాళములలో మహోన్నతశక్తి నుద్దీపింపజేయగల యొక నూతన విద్యుత్తేజమే భారతదేశమున కిప్పుడు కావలసినది. ధైర్యమువహింపుఁడు. ధైర్యము వహింపుఁడు. మనుజుఁడు మరణించునది ఒక్కసారియే। నా శిష్యులు పిరికివందలుగానుండరాదు. పిరికితనమనిన నాకు చాల అసహ్యము. గొప్ప మనఃస్థైర్యము గలిగియుండుఁడు. అల్పులగు ఇతరులు మిమ్ములనుగూర్చి పలుకువాక్యములను లెక్కచేయరాదు. వారియెడల ఉదాసీనత్వమును వహింపుఁడు. ముమ్మాటికి ఉదాసీనత్వమే। కన్నులు రెండు. చెవులు రెండు. కాని నోరు మాత్రము ఒక్కటియే యని జ్ఞప్తియందుంచుకొనుఁడు. మహాకార్యములన్నియు గొప్ప విఘ్నములమధ్యనే నెరవేర్పఁబడుచుండును. కావున మీ యావచ్ఛక్తిని (పురుష ప్రయత్నమును) ప్రదర్శింపుఁడు।

Strength is the medicine for the world's disease. Strength is the medicine which the poor must have when tyrannized over by the rich. Strenghth is the medicine which the ignorant must have when oppressed by the learned. And it is the medicine that sinners must have when tyrannized over by other sinners.

బలమే (ధైర్యమే, ఉత్సాహమే) భవరోగము నకు మందు, ధనవంతులచే పీడింపబడునపుడు బీదలకుండ వలసిన ఔషధము ఈబలమే. విద్యావంతులచే అణగ ద్రొక్కబడునప్పుడు సామాన్యులకుండవలసిన ఔషధము ఈ బలమే. అట్లే ఇతర పాపులచే బాధింపబడునపుడు పాపాత్ములకుండవలసిన ఔషధము ఈ బలమే.



What the world wants is the character. The world is in need of those whose love is one burning love—selfless. That love will make every word tell like a thunderbolt. Awake, awake, great souls! The world is burning in misery. Can you sleep?

లోకమునకు కావలసినది శీలమే. కేవలము జాజ్వల్యమగు నిస్స్వార్థ ప్రేమ గలవారే లోకమునకు ఆవసరము. అట్టి ప్రేమతో వచింపబడిన ప్రతిమాటయు పిడుగువలె పరిపూర్ణ ప్రభావంతమై యుండును. కావున మహాత్ములారా! లెండు! మేలుకొనుడు! లోకము దుఃఖాగ్నిలోబడి సంతప్తమగుచున్నది. ఇట్టి స్థితిలో మీరు నిద్రింపగలరా!

We should cultivate the optimistic temperament and endeavour to see the good that dwells in everything. If we sit down and lament over the imperfection of our bodies and minds, we profit nothing. It is the heroic endeavour to subdue adverse circumstances, that carries our spirits upwards.

సదా సంతోషస్వభావమునే మనము అలవఱచుకొనవలెను. మఱియు ప్రతివస్తువునందుగల గుణమునే చూచుటకు యత్నింపవలెను. ఒకచోట కూర్చొని మనయొక్క మనస్సులందు, శరీరములందుగల లోపములను గూర్చి ఏడ్చుచు మొత్తుకొనుచు నుండుటవలన ఏ మాత్రము ప్రయోజనముండదు. ప్రతికూలవాతావరణమును లొంగదీసి విజయమును సాధించు ధీరోద్యమమే మనకు ఆత్మోన్నతిని చేకూర్చగలదు.

What the world wants is the character. The world is in need of those whose love is one burning love—selfless. That love will make every word tell like a thunderbolt. Awake, awake, great souls! The world is burning in misery. Can you sleep?

లోకమునకు కావలసినది శీలమే. కేవలము జాజ్వల్యమగు నిస్స్వార్థ ప్రేమ గలవారే లోకమునకు అవసరము. అట్టి ప్రేమతో వచింపబడిన ప్రతిమాటయు పిడుగువలె పరిపూర్ణ ప్రభావంతమై యుండును. కావున మహాత్ములారా! లెండు! మేలుకొనుడు! లోకము దుఃఖాగ్నిలోబడి సంతప్తమగుచున్నది. ఇట్టి స్థితిలో మీరు నిద్రింపగలరా!

We should cultivate the optimistic temperament and endeavour to see the good that dwells in everything. If we sit down and lament over the imperfection of our bodies and minds, we profit nothing. It is the heroic endeavour to subdue adverse circumstances, that carries our spirits upwards.

సదా సంతోషస్వభావమునే మనము అలవఱచుకొనవలెను. మఱియు ప్రతివస్తువునందుగల గుణమునే చూచుటకు యత్నింపవలెను. ఒకచోట కూర్చొని మన యొక్క మనస్సులందు, శరీరములందుగల లోపములను గూర్చి ఏడ్చుచు మొత్తుకొనుచు నుండుటవలన ఏ మాత్రము ప్రయోజనముండదు. ప్రతికూలవాతావరణమును లొంగదీసి విజయమును సాధించు ధీరోద్యమమే మనకు ఆత్మోన్నతిని చేకూర్చగలదు.

Despondency is not religion, whatever else it may be. By being pleasant always and smilling it takes you near to God, nearer than any prayer.

నైరాశ్యము (దిగులు) ఏదైన కావచ్చునుగాని మతము మాత్రము కాదు. ఎల్లపుడు ఉల్లాసముగా చిరునవ్వుగల ముఖముతో నుండువాడు ప్రార్థనలు చేయువానికంటె సులభముగా భగవత్సాన్నిధ్యమును పొందగలడు.



One may gain political and social independence, but if he is a slave to his possessions and desires he cannot feel the pure joy of real freedom.

మానవుడు రాజకీయ స్వాతంత్ర్యమును, సాంఘిక స్వాతంత్ర్యమును కూడ పొందవచ్చునుగాని అరిషడ్వర్గములకు (కామక్రోధాదులకు) లోబడియున్నంతవఱకు యథార్థ స్వాతంత్ర్యమువలన లభ్యమగు విశుద్ధానందమును అత డెన్నటికిని చవిచూడజాలడు.

Take up one idea. Make that one idea your life; think of it; dream of it; live on that idea. Let the brain, muscles, nerves, every part of your body be full of that idea, and just leave every other idea alone. This is the way to success and this is the way great spiritual giants are produced.

ఏదైన ఒక భావమును (ధర్మమును) గైకొని దానినే నీ జీవితసర్వస్వముగ జేసికొనుము. దానిని గూర్చియే భావింపుము. దానిని గూర్చియే మననము చేయుము. స్వప్నమందుకూడ అదియే వచ్చునంతటితీవ్రముగ దానిని గూర్చి యోచింపుము. నీమస్తిష్కము, కండరములు, నాడులు, ప్రతిఅవయవముకూడ అద్దానిమయమై యుండునటుల చూడుము. ఇతర సంకల్పములన్నిటిని వదలివేయుము. విజయప్రాప్తి కిదియే రాజబాట. మఱియు అధ్యాత్మక్షేత్రమున మహామహులు ఏర్పడు విధాన మిదియే అయియున్నది.

You will understand Gita better with your biceps, your muscles a little stronger. You will understand the mighty genius and the mighty strength of Krishna better with a little of strong blood in you. You will understand the Upanishads better and the glory of the Atman when your body stands firm upon your feet and you feel yourselves as men.

భుజకండరములు, శరీరావయవములు ఇంక కొంత బలిష్ఠములుగా నున్నపుడు మీరు గీతను ఇంకను బాగుగ అర్థము చేసికొనగలరు. మీలోని రక్త మొకింత పుష్టినొందినచో శ్రీకృష్ణుని యొక్క మహాత్తర ప్రతిభను, అద్భుతశక్తిని ఇప్పటికంటె చక్కగా గ్రహింపగలుగుదురు. మీ శరీరములు మీ పాదముల మీద సుస్థిరముగ ఎపుడు నిలుచునో మఱియు మానవులమను భావము మీ కెపుడు స్పష్టముగా తోచునో (ఎపుడు మీరు శరీరసౌష్ఠవము, ఆరోగ్యము బొంది యుందురో) అపుడు మీరు ఉపనిషత్తులను, ఆత్మ యొక్క వైభవమును ఇంకను బాగుగ తెలిసికొనగలరు.

The whole universe is a mass of change. But there is one who never changes and that is God. From whom all beings are projected, in whom all live and unto whom they all return, that is God. The embodiment of freedom, the master of nature is what we call God. Where one does not see another, where one does not bear another, that is the greatest, that is God.

విశ్వమంతయు పరిణామశీలమై యున్నది. కాని ఎన్నడును ఏ మాత్రమును పరిణామము నొందని వాడొకడు కలడు. అతడే దేవుడు. ఎవనినుండి సమస్త భూతకోట్లు ఆవిర్భవించుచున్నవో, ఎవనియం దవి యన్నియు స్థితిని బొందుచున్నవో, తుద కెవనియం దవి లయ మొందుచున్నవో, అతడే దేవుడు. పరిపూర్ణ స్వాతంత్రత కలవాడును, ప్రకృతికి అధిపతియైన మహాశక్తివంతునే మనము దేవుడనుచున్నాము, ఏ అద్వయ (సచ్చిదానంద) స్థితియందు ఒకడు మఱి యొకనిని చూచుటగాని, ధరించుటగాని సంభవింపదో, అదియే సర్వోత్తమస్థితి. అట్టి స్థితియే దైవము.

---

Those that want to help mankind must take their own pleasure and pain, name and fame and all sorts of interests, and make a bundle of them and throw them into the sea and then come to the Lord. That is what all the masters said and did.

లోకోపకారము చేయదలంచువారు తమ కష్ట సుఖములను, పేరు ప్రతిష్ఠలను, తమకు ప్రసక్తిగల సమస్తమును గైకొని కట్టగట్టి సముద్రములో పారవేసి ఆ పిదప భగవంతుని సన్నిధికి రావలెను. మహాత్ము లందరును బోధించినది, ఆచరించినది ఇదియే.

If the sun by the cloud is hidden a bit
If the welkin shows but gloom,
Still hold on yet a while, brave heart,
The victory is sure to come.

No winter was but summer came behind
Each hollow crests the wave
They push each other in light and shade
Be steady then and brave.

The duties of life are sore indeed
And its pleasures fleeting, vain
The goal so shadowy seems and dim
Yet plod on through the dark, brave heart
With all thy might and main.

మబ్బు భాస్కరు నొక్కప్డ మాటుగాక
అంధకారంబె దివినెల్ల వలముగాక
తాళు మొక్కింత తడవీవు ధైర్యమూని
జయము చేకురు దుదిని నిస్సంశయంబు.

ఎండకాలంబు తుద వర్షఋతువురాదె
గండియె తరంగ శిఖరమౌగాదె యబ్ధి
నెట్టుకొనుచుండు నివి వెల్గునీడలందు
గాన ధైర్యంబు స్థైర్యంబు బూనియుండు.

వరువి కర్తవ్యములు క్లేశకరము లెంతొ
వచ్చు సుఖములు క్షణికముల్ వ్యర్థములవు
గమ్యమేర్పడ దెంతయు గాని పూర్ణ
శక్తి జీకటి గప్పించి సాగు ధీర।

Forget not that thy wealth, thy life are not for sense-pleasure, are not for thy individual happiness; Forget not that thou art born as a sacrifice to the Mother's alter; Forget not that thy social order is but the reflex of the Infinite Universal Motherhood; Forget not that the lower classes, the ignorant, the poor, the illiterate, the cobbler, the sweeper, are thy flesh and blood, thy brothers.

జనులారా! మీ సంపదలు, మీ జీవితములు ఇంద్రియసుఖసంపాదనము కొఱకు కావనియు, స్వసుఖ సాధనకొఱకు కూడ కావనియు మఱువకుడు. భారత మాతయొక్క యజ్ఞపీఠమునందు ఆహుతి యగుటకే మీరు జన్మించితిరని మఱువకుడు. మీ సంఘవ్యవస్థ అఖండవిశ్వముయొక్క ప్రతిరూపము మాత్రమే యని మఱువకుడు. నిమ్న జాతులు, పామరులు, దీనులు, విద్యావిహీనులు, మాదిగవారు, పాకీవారు మీ రక్త బంధువులే యనియు, మీ సోదరులే యనియు మఱువకుడు!

You have now to make the character of Mahavira (Hanuman) your ideal. See how at the command of Ramachandra he crossed the ocean. He had no care for life or death! He was a perfect master of his senses and wonderfully segacious. You have now to build your life on this great ideal of personal service. Through that all the other ideals will gradually manifest in life.

Obedience to the Guru without questioning and strict observance of Brahmacharya–this is the secret success. As on the one hand Hanuman represents the ideal of service, so on the other he represents leonine courage, striking the whole world with awe.

మీ రిప్పుడు హనుమంతుని శీలమును ఆదర్శముగా నుంచుకొనవలెను. శ్రీరామచంద్రుని ఆజ్ఞను శిరసావహించి అతడు సముద్రము నెట్లు లంఘించెనో చూడుడు! చావుబ్రతుకుల నతడు లక్ష్యపెట్టవేలేదు. అతడు అద్భుతమగు ఇంద్రియనిగ్రహము కలవాడు. అతని బుద్ధి వివేకము లాశ్చర్యజనకములు. సేవ యను ఈ ఉన్నతాదర్శము ననుసరించి మీరు మీ జీవితములను నిర్మించుకొనవలెను. దీని ద్వారా తక్కిన ఆదర్శములన్నియు క్రమముగా జీవితమునందు ప్రకటితములు కాగలవు.

మారుమాటాడక గుర్వాజ్ఞను శిరసావహించుట, బ్రహ్మచర్యమును చక్కగ పరిపాలించుట-ఇవియే విజయమునకు కీలకములు. హనుమంతుడు సేవాధర్మమున ఆదర్శమూర్తి యగుటయేకాక లోకుల నాశ్చర్యచకితులజేయు ధైర్యసాహసములు, సింహపరాక్రమముగల వ్యక్తి అయియున్నాడు.

To succeed you must have tremendous perseverance, tremendous will. "I will drink the ocean" says the preserving soul; "at my will mountains will crumble up." Have that sort of energy, that sort of will, work hard and you will reach the goal.

ఏ కార్యమందైన విజయమును సాధించవలెననిన గొప్ప పట్టుదల, అకుంఠితమగు దృఢనిశ్చయము గలిగి యుండవలెను. పట్టుదల గలవాడు "నేను సముద్రమును గూడ త్రాగివైచెదను" అని ధైర్యముతో పలుకును. "నాయాజ్ఞచే పర్వతములు కూడ కదలివచ్చును" అని చెప్పగలుగునంతటి మహత్తర ధైర్యస్థైర్యము, శక్తి సామర్థ్యము, దృఢనిశ్చయము గలిగియుండుము. కష్టపడి పనిచేయుము. పట్టుదలతో (దైవ) సాధన యొనర్పుము. తప్పక నీవు గమ్యస్థానమును చేరగలవు.

No need of looking behind. Forward!
We want infinite energy, infinite zeal,
Infinite courage and infinite patience,
Then only will great things be achieved.

Have faith that you are all, my brave lads, born to do great things. Let not the barks of puppies frighten you, no, not even the thunderbolts of heaven, but stand up and work.

వెనుకకు చూడవలసిన పనిలేదు. ముందునకు నడువుడు! అఖండశక్తి, అఖండోత్సాహము, అఖండ ధైర్యము, అఖండసహనము–ఇవియే మనకు కావలసినవి. అవియున్ననే గొప్ప గొప్ప కార్యములు సాధింపబడగలవు.

ఓ ధీర ప్రజలారా! మీరందఱును మహత్తర కార్యనిర్వహణమునకై జన్మించితిరను పరిపూర్ణ విశ్వాసమును గలిగి యుండుడు! కుక్కపిల్లల అరుపులకు భయపడకుడు! ఆకసమునుండి క్రిందపడు భయంకరములైన పిడుగులనుకూడ లెక్కసేయకుడు! లెండు! కార్యశూరులు కండు!

The world requires a few hundred bold men and woman. Practise that boldness which dares know the truth, which dares show the Truth in life, which does not quake before death, nay, welcomes death, makes a man know that he is the spirit, that, in the whole universe nothing can kill him. Then you will be free.

అఖండధైర్యోపేతులగు పురుషులు, స్త్రీలు, కొన్ని వందలమంది ఇపుడు ప్రపంచమునకు కావలసి యున్నారు. జనులారా! సత్యమును (భగవంతుని) ఎఱుగుటకై సాహసించునట్టియు, సత్యమును జీవితము నందు దిగ్దర్శన మొనర్చుటకై పూనుకొనునట్టియు పరమ ధైర్యమును మీరు అభ్యసింపుడు! మృత్యువు నెదుట ఏమాత్రము జంకనట్టియు, ఇంతియే కాదు. మృత్యువునకు స్వాగతమునుగూడ ఒసంగునట్టియు అపారధైర్యమును మీరు అభ్యాసము చేయుడు! తాను ఆత్మయే కాని దేహాదులు కాదనియు, బ్రహ్మాండమునందెల్లెడల తన్ను వధింపజాలిన పదార్థ మొద్దియు లేదనియు ఎఱిగింపజేయు నట్టి పరమధైర్యమును మీరు అభ్యసింపుడు!

Never mind failures; they are quite natural, they are the beauty of life—these failures. What would life be without them? It would not be worth having. If it were not for struggles where would be the poetry of life? Never mind the struggles, the mistakes. I never heard a cow tell a lie, but it is only a cow—never a man. So never mind these failures, these little - back slidings. Hold the ideal a thousand times, and if you fail a thousand times, make the attempt once more.

ధర్మముకొఱకు, దైవముకొఱకు ఆయిన పోరాటములో అపజయములను లెక్కపేయకుడు। అవి సామాన్యముగ వచ్చుచునే యుండును. వానివలన జీవితమునకు ఒక లావణ్యమేర్పడును. అవి లేనిచో జీవితమునకు కళాకాంతులుండవు. ప్రయత్నములు, పోరాటములు లేనిచో జీవితమునకు శోభ యెచట? పొరపాట్లను, అపజయములను లెక్కపేయకుడు. ఆవు అబద్ధము చెప్పినట్లు నేనెప్పుడును వినలేదు. అయినను అది ఆవేకాని మనుష్యుడు కాదు. కాబట్టి అపజయములను, వెనుకకు దిగజారుటను లక్ష్యపెట్టకుడు. (ముందునకే చనుటకు యత్నింపుడు). లక్ష్యమునే అంటిపెట్టుకొనుడు. వెయ్యి పర్యాయములు ఓడిపోయినను మరల ఇంకొక ప్రయత్నమును చేయుడు।

All the powers in the universe are already ours. It is we who have put our hands before our eyes and cry that it is dark. Know that there is no darkness around us. Take the hands away and there is the light which was from the beginning. Darkness never existed, weakness never existed. We who are fools cry that we are weak; we who are fools cry that we are impure.

ప్రపంచములో గల సమస్త శక్తులు మనవే అయి యున్నవి. మన చేతులతో మనకండ్లను మనమే మూసికొని చీకటి అని వ్యర్థముగ అఱచుచున్నాము. వాస్తవముగ మనచుట్టూ చీకటి అనునదియే లేదని యెఱుంగుడు. కండ్లయెదుట పెట్టుకొనిన చేతులను తీసివేయుడు. అత్తఱి మొదటినుండియు వెలుగుచున్న ప్రకాశము దృగ్గోచరము కాగలదు. చీకటి ఏకాలమందును లేదు. దుర్బలత్వము ఏకాలమందును లేదు. మూఢులగువారే మేము దుర్బలురము, 'మేము అపవిత్రులము' అని అఱచుచుందురు. (వాస్తవముగ మనుజుడు దుర్బలుడు కాడు. అపవిత్రుడుకాడు. పరమ పవిత్ర సచ్చిదానంద స్వరూపుడు. ఇట్టి స్థితిని పదేపదే మననము చేసికొని ధైర్యవంతులై మెలఁగుడు!)

Who cares for name? Off with it! If in the attempt to carry morsels of food to starving mouths, name and possession and all be doomed even—thrice blessed art thou. It is the heart, the heart that conquers, not the brain. Books and learning, yoga and meditation and illumination-all are but dust compared with love.

ఎవనికి కావలెను కీర్తి! అది తుచ్ఛము. దాని ప్రసక్తియే పెట్టుకొనకుము. అన్నాతురులై మాడుచున్న వారి ఆకలి తీర్చు ప్రయత్నములో నీ పేరుప్రతిష్ఠలు, ఆస్తిపాస్తులు మొదలగునవి యన్నియు నశించినను - నీవు ముమ్మాటికిని ధన్యుడవు. గెలుపొందునది హృదయమే కాని మెదడు కాదు. (ప్రేమయే కాని విద్వత్తు కాదు.) గ్రంథములు, పాండిత్యము మున్నగునవి యన్నియు ప్రేమ (కరుణ)తో పోల్చిచూచిన చో తృణప్రాయములే యగును.

Thou brave one, be bold, take courage, be proud that thou art an Indian-and proudly proclaim—"I am an Indian—every Indian is my brother." Say,—"The ignorant Indian, the poor and destitute Indian, the Brahmin Indian, the pariah Indian, is my brother." Thou too clad with but a rag round thy loins proudly proclaim at the top of thy voice—"The Indian is my brother,—the Indian is my life, India's Gods and Goddesses are my God, India's society is the cradle of my infancy, the pleasure-garden of my youth, the sacred heaven, the Varanasi of my old age."

ఓ ధీరుడా! లెమ్ము! ధైర్యము వహింపుము. నీవు భారతీయుడవని గర్వింపుము. "నేను భారతీయుడను. ప్రతి భారతీయుడు నా సోదరుడు" అని సగర్వముగా ప్రకటింపుము. "అజ్ఞుడగు భారతీయుడు, నిఱుపేదయైన భారతీయుడు, బ్రాహ్మణ భారతీయుడు, చండాల భారతీయుడు-వీరందఱు నా సోదరులే" అని ఘోషింపుము.

నడుమునకు ఒక గుడ్డపేలికమాత్రమే చుట్టుకొనియుండు నీవును. "భారతీయుడు నా సోదరుడు, భారతీయుడు నా ప్రాణము, భారతదేశపు దేవదేవీజనమే నా దైవము. భారతసంఘమే నా బాల్యకాలపు ఉయ్యాల, నా యౌవనకాలపు క్రీడావనము, నా వార్ధక్యమునాటి వారాణసి, నా పుణ్యలోకము" అని సగర్వముగ ఉన్నతస్వరమున ప్రకటింపుము!

Power and things like that will come by themselves. Put yourself to work and you will find such tremendous-power coming to you that you will feel it hard to bear it. Even the least work done for others awakens the power within; even thinking of the least good of others gradually instils into the heart the strength of a lion. I love you all ever so much but I would wish you all to die working for others. I should be rather glad to see you do that!

బలము, శక్తి మొదలైనవన్నియు తమంతట తామే వచ్చును. మొట్టమొదట కార్యశీలురు కండు, అత్తరి మీకే దుర్భరముగ తోచునంతటి మహత్తర శక్తి మీయందు ప్రాదుర్భవింపజొచ్చును. ఇతరుల శ్రేయస్సుకొఱకై చేయునట్టి స్వల్పకృషికూడ మీలో నున్న శక్తిని మేలుకొల్పును. పరహితమును గూర్చిన ఒకింత చింతకూడ క్రమముగ మీహృదయమున సింహబలమును ఉద్దేశింపజేయును. మీరందఱియందును నాకు పరమప్రీతి కలదు. అయినను మీరందఱును ఇతరుల కొఱకై పాటుపడుచు మరణించుట నాకు చాల ఇష్టము. ఆప్రకారముగ పరహిత మొనర్చుచు మీరు మరణించెద రేని నే నెంతయో ఆనందించెదను.

Have faith in the Lord. Give me a genuine man; I do not want masses of converts. Do not care for anybody to help you. Is not the Lord infinitely greater than all human help? Be holy, trust in the Lord, depend on Him always, and you are on the right track; nothing can prevail against you.

దేవునియందు భక్తిశ్రద్ధలు కలిగియుండుడు. నిష్కపటియు, విశ్వాసపాత్రుడును అయిన ఒక్కని నాకొసంగుడు. విశ్వాసహీనులైన అనేకులు నాకక్కఱలేదు. మీరెవరియొక్క తోడ్పాటుకొఱకును అఱ్ఱులు చాచవలసిన పనిలేదు. మానవులందఱి సహాయముకంటెను భగవంతుడు అనేకరెట్లు అధికుడుకదా! కావున పవిత్రులైయుండుడు. భగవంతునియందు పూర్ణవిశ్వాసముంచుడు. అతనిపైననే నిరంతరము ఆధారపడియుండుడు. అపుడే మీరు సరియైన పంథా త్రొక్కినట్లగును. అత్తఱి మిమ్ముల నేదియు జయింప సమరము కాజాలదు.



Unselfishness is the test of religion. He who has more of this unselfishness is more spiritual and nearer to Siva. And if a man is selfish even though he has visited all the temples, seen all the places of pilgrimage and painted himself like a leopard, he is still further off from Siva.

స్వార్థరాహిత్యమే, పరహితవాంఛయే ధర్మమయ జీవితమునకు గుఱుతు. అదియే మతమునకు చిహ్నము. ఇట్టి నిస్వార్థత ఎవనియందు అధికముగా నుండునో, అతడే గొప్ప ఆధ్యాత్మిక సంపన్నుడు. అట్టివాడే శివునకు (దేవునకు) అతిసమీపముగా నుండును. అట్లు కాక, ఎవడు స్వార్థముతో గూడియుండునో పరహితవాంఛారహితుడై వర్తించునో, అట్టివాడు ప్రపంచములోగల దేవాలయములన్నిటిని సందర్శించినప్పటికిని, చిఱుతపులివలె ఒడలంతయు రంగులతో అలంకరించుకొన్నప్పటికిని, శివునకు (దేవునకు) అతడు చాల దూరముగ నున్నవాడే యగును.

కిం నామ రోదిషి సఖే త్వయి సర్వశక్తిః
ఆమంత్రయస్వ భగవన్ భగదం స్వరూపమ్
త్రైలోక్యమే తదఖిలం తవ పాదమూలే
ఆత్మైవహి ప్రభవతి న జడః కదాచిత్.

(స్వామి వివేకానంద)

మిత్రుడా! ఏల యేడ్చుచున్నావు! సమస్త శక్తులు నీయందే కలవు. దివ్యమూర్తీ! ఆనంద దాయకమగు నీ స్వస్వరూపమును స్మరింపుము. మూడులోకములు నీ పాదముల చెంతనే కలవు. సమస్తమునకు కారణభూతమైనది నీ ఆత్మయే. అది ఏ కాలమందును జడముకాదు. అది నిత్య శుద్ధ చిన్మయ రూపము. అదియే నీవు. కావున దుఃఖమును వదలివైచి ఆనందాబ్ధియం దోల లాడుము!